# సతీహిత సంగ్రహము.

ఇది

బాలికలకు నుపయుక్తంబుగ

---

కడపలో నుండెడు

గవ్వల. రామానుజులు నాయని వారిచే

రచింపఁబడి

---

చెన్నపురిశాఖానగరముగుతిరువల్లిక్కేణిలో నెలకొనియున్న

సంజీవనీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

---

౧౮౭౮ సం॥ జూలై నెల ౯ తేది.

# పీఠిక.

విద్య యావశ్యకమని యెల్లరకును దెల్లంబు గాన బురుషులకువలె స్త్రీలకు నది యుచితంబు.

గృహ కృత్యములెల్ల నిల్లాండ్రవి యగుటం జేసి, వారికి నీతి సదాచారము మొదలగు సద్గుణములు కలిగి యుండుటకై గ్రంథములు రచియింపఁబడి యుండవచ్చును. అయిన, గేహినులకు విద్యవలని ఫలము పాతివ్రత్యమే యనియుఁ, దత్సదాచారపరిజ్ఞానమునకుఁ జదువు సముచిత సాధనమనియు నిరూపించు సమంచిత గ్రంథము లేకుండఁగ నున్నది. ఉండెడునొకటిరెం డాధునిక కృతులును, ప్రాచీన గ్రంథ భాగములును నానావిషయ బోధకములుగఁ బఠన సంక్షేపములుగ, విశేష విద్యాబలముగలవారికి దప్ప, నిస్సంశయముగ నెఱుఁగ దుర్గ్రహములైనవిగ నున్నవి.

కాఁబట్టి సతీ హిత సంగ్రహ మనుపేర నీ పుస్తకమును సమకూర్చితి. ఇందు మొదటిభాగము, కేవల వాక్యములు. వీనిలోనివి కొన్ని, శిష్టు- కృష్ణమూర్తి శాస్త్రులవారు రచియించిన స్త్రీనీతిశాస్త్రమను పద్య కావ్యమున నుండి సంగ్రహింపఁబడినవి. శేషించిన మూఁడు భాగములు, శ్రీమహాభారతమునందుండి ప్రకృత ప్రస్తావ పోషణంబునకై సంగ్రహింపఁబడిన సావిత్ర్యుపాఖ్యానము, పుణ్యసతీ ప్రభావము, సత్యా ద్రౌపదీ సంవాదమును గా నుండెడును.

శ్రీరస్తు.

---

# శ్రీ నీ తి వా క్య ము లు.

౧. అనృత[౧] మన్ని పాపములలో నధికము.

౨. అన్ని దానములలో నన్నదానము శ్రేష్ఠము.

౩. అత్తమామలపై భక్తినునుపు- వారిమాట దాటక యాలకింపు[౨]- వారిని బూజింపు- వారికడఁ గసరుకొనకు[౩].

౪. అతిథుల[౪] కన్నముఁ బెట్టు- వారిమీఁద కోపము నణఁపు.

౫. అనువుగ[౫] వండి[౬], యాత్మకునకుఁ బెట్టు.

---

౧. అసత్యము
౨. విను
౩. కోపగింపకు
౪. యాచకులకు.
౫. చక్కఁగా
౬. మగఁడు

# స్త్రీనీతి వాక్యములు.

౬. అప్పుఁ జేయ వలదు.

౭. అరుణోదయమున[౧] మేల్కాను - దంత ధావన[౨] మొనర్చుకొను.

౮. అహంకారమును[౩] మాను.

౯. అకాలా[౪]హార[౫] నిద్ర ల[౬]సుఖకరములు.

౧౦. అన్య పురుషు నన్నగఁ జూడకు- చూచి నవ్వకు.

౧౧. అక్క చెల్లెలు మొదలైనవారి నాదరింపుము.

౧౨. అల్లుని నంతకు హెచ్చుగ నాదరింపు(దుహితకై[౭])

౧౩. అన్నదమ్ములు వేరుపడ నతిఁక[౮], వేరు గాఁకూడదు.

---

౧. తెల్లవార.
౨. పండ్లుతోముకొను.
౩. గర్వమును.
౪. కానివేళయందు.
౫. భోజనము.
౬. అసౌఖ్యముఁ జేయునవి.
౭. కూఁతుకై
౮. మూలము.

౧౪. అన్నిట శుచిగ[౧] నుండుట యందము.

౧౫. అంటుతో, నింటి ముందటి యావరణము జేరకు- (ఇంటివెనుక నుండు.)

౧౬. అంక[౨] లేఖనముల[౩] నభ్యసింపు[౪]- (ఉపాధ్యాయుల లెక్కఁబెట్టను, ఇటుల వ్రాయను-)

౧౭. అతి[౫] తప్ప వలదు.

౧౮. అందుబిడ్డల యాలి కష్టపడకు.

౧౯. ఆభరణములలేమి[౬] కలుగకు[౭].

౨౦. ఆత్మహత్య[౮] గూడదు.

౧ పరిశుద్ధముగ.
౨ అంకె.
౩ వ్రాఁత.
౪ నేర్పుము.
౫ చెప్పి.
౬ సొమ్ములు లేకపోవుటకు.
౭ కోపింపకు.
౮ తన్ను హింసించుకొనుట.

౪ స్త్రీ నీతి వాక్యములు.

౨౧. ఆత్మేశు సన్నిధి ననుభవములఁ గోరకు.[౧]

ఆపని రాకఁ గోరు. (తలయంటుకొనుట, రుచికర
మును బలకరమునగు తిండి దినుట. సింగారించు
కొనుట)

౨౨. ఆత్మేశుఁ డుందుమన్నచో నుండు.

౨౩. ఆతురత[౨] యొకని బనికిరాదు.

౨౪. ఆపదఁ జెందినవేళ, నాపద్బాంధవు[౩] స్మరింపు.

౨౫. ఆశఁబెట్టి, మోసపుచ్చకు.

౨౬. ఆరాధన[౪]కుం దాహారము కూడదు (దేవ
తార్చన గృహములలోన)

౧ దగ్గరలేనప్పుడు. ౩ భగవంతుని.
౨ తొందర ౪ దేవపూజకు.

౨౭. ఇహ[౧] పర[౨] సాధన[౩] మెదియో[౪] చూడు.

౨౮. ఇచ్చి వగచుట[౫], పిచ్చితనము.

౨౯. ఇట్టి పుస్తకములఁ జదువు- (౧౬౯ - ౨౩౬ - ౨౪౪- వాక్యములఁ జూడు.

౩౦. ఇరుగు పొరుగులను, బరుషము[౬]లాడకు.

౩౧. ఇల్లామల్లి[౭]తన మినుమంతయు[౮] వలదు.

౩౨. ఇల్లాలు చెడుదైన[౯], నింటి[౧౦] కపకీర్తి.

౧ ఇహలోకము
౨ పరలోకము
౩ ఉపాయము
౪ యోచింపు
౫ చింతించుట
౬ కఠినపుమాటలు
౭ ఒకచోటి మాట మఱియొకచోటఁ జెప్పి కలహముఁ గలిగించుట.
౮ కొంచెమైనను
౯ దుష్టురాలు
౧౦ వంశమునకు

# స్త్రీనీతి వాక్యములు.

౩౩. ఇంటిగుట్టు[౧], రట్టు[౨]పఱుపకు.

౩౪. ఇంటిపనులకు సోంటికత్తె యనకు (పనివాండ్ర నుంపు)

౩౫. ఇంటివాకిట సోంటిగ నిలువకు.

౩౬. ఇల్లువాకిండ్లఁ బరిశుద్ధముగ నుంపు.

౩౭. ఈవి కడ్డుపడకు.

౩౮. ఉలికి యులికి నడవకు.

౩౯. ఊరక ప్రొద్దుఁ బుచ్చకు.

౪౦. ఊరక వక్కాకు నమలకు.

౪౧. ఊరు తిరుగఁ బోకు.

౪౨. ఋజుమార్గ[౩]ప్రచారము మేలు.

౪౩. ఋణమును దీర్చి బ్రదుకు ( అప్పుఁజేసిన)

౪౪. ఋతుమతిత్వము స[౪]ప్రతీతముగ జరుపు.

౧ రహస్యము
౨ వెల్లడిచేయకు
౩ కపటములేనినడవడి
౪ అంటుపడకయుండునట్లును రగినట్టు గుట్టుగా

౪౫. ఎవరి[1] కేది విహితమో, వారు దాని నేర్వవలె.

౪౬. ఎంత దొరకిన, నంతతో సంతసిలు.

౪౭. ఎంతటైనను బరపురుషునిపై[2] మనసుఁ బా-

నీయకు (అది మానసిక[3] పాపము)

౪౮. ఏమఱి[4] నిద్దురఁబోకు.

౪౯. ఏలినపతి నెప్పటికి విడువకు.

౫౦. ఐశ్వర్యమున[5] కణఁకువ[6] బంగారుకుఁ బటికవలె.

౫౧. ఒరులఁ[7] జెఱుపకు. (చెఱిచితివా చెడెదవు)

౫౨. ఒడలు[8] చూచుకొని వెడలు. (మానమునకై)

---

౧ తగినదో
౨ మగనికంటె నన్యునిపై
౩ మనస్సునఁగలిగినది
౪ పరాకుపడి
౫ సంపదకు
౬ వినయము
౭ అన్యుల
౮ దేహము

౫౩. ఒంటిగఁ దిరుగఁ బోకు.

౫౪. ఓర్వలేమి యౌర్వానలమునకు[౧] సమము.

౫౫. ఓర్పు గలిగియుండుము.

౫౬. ఔదార్యమున[౨] కణఁకువను జేర్పు.

౫౭. కన్నవారినిఁ[౩] గనికరింపు.

౫౮. కష్టసుఖములు గలసియుండుము.

౫౯. కానివారి[౪] తెరువునకుఁ బోకు.

౬౦. కాయము[౫] నిత్యము[౬] గాదు.

౬౧. కాళ్ల చక్కఁగఁ గడుగుకొనుము.

---

౧ సముద్రములోనుండి యుండెడి నీళ్ళఁ బీల్చు చుండు నిప్పు.

౨ దాతృత్వము.

౩ తల్లిదండ్రులను

౪ పగవారిజోలికి.

౫ ఒడలు

౬ ఎప్పటికి నుండునది.

# స్త్రీనీతివాక్యములు.



౬౨. కితవుల[౧] చెంతఁ జేరకు.

౬౩. కినుక[౨] దెచ్చికొనకు.

౬౪. కీర్తి నొందఁ గోరు.

౬౫. కుటిల[౩] బుద్ధి మాను.

౬౬. కుదురులేక నడవకు- (అందుకే, పావడములు)

౬౭. కుత్సిత[౪] బుద్ధి గూడదు.

౬౮. కుజనులఁ[౫] గూడఁ గూడదు.

౬౯. కుట్టుపనుల నేర్చికో (పొట్టకైన జీవింప:)

౭౦. కృతము,[౬] మఱవఁగూడదు.

౧ మోసగాండ్రు — ౪ నీచము

౨ కోపము — ౫ దుర్జనులు

౩ వంకర — ౬ పరులుచేసిన మేలు

౭౧. కృషికులు కృషివలుఁ దీర్పవలె- (కూలి పెట్టిన, కూటికో)[1]

౭౨. క్రూరకర్మ[2] కూడదు.

౭౩. కొడుకులఁ గూఁతులఁ గొట్టకు-(చిన్నఁగా దిద్దు)

౭౪. కాలతఁ దెలిసి కొనుము (మునుగు కింతదైన దేనికెంతయని)

౭౫. కొండెములఁ[3] జెప్పకు.

౭౬. కొంగఁ గూల్చిన కోపి, కోమలికి[4] నలిగి భస్మ దయ్యె. (పతివ్రత ప్రభావ మిట్టిది)

౭౭. కోడలినిఁ గూఁతువలెఁ జూడుము. (కోడలికి "దీపావళికి దీపావళికి" అని త్వర త్వరగను, కూఁతునకు,

---

౧ మున్నుగాను వారు  ౪ పుణ్యపతివ్రత భారతము ౭౫

౨ భయంకరమైనవని  పుటయూదఁగఁ జూడు.

౩ చాడీలు

"ఎప్పుడో వారమున కొకతేప,, అని తిన్నఁగ ను ఎందుకుఁ జెప్పవలె)

౨౮. ఖల సాంగత్యము కీడు.[1]

౨౯. గర్జన, తర్జనాదులకుఁ బతిని వర్జింపకు.[2][3][4]

౩౦. గయ్యాళి యనుపేరు గర్హితము.[5]

౩౧. గర్వము పనికి రానిది.

౩౨. గాయమును కట్టిమాన్పు (లేకున్నఁజెడ్డపగు)

౩౩. గాంధారిపతివ్రత కన్నులఁగట్టికొనె(అతఁడంధుఁడైనందున)

౩౪. గాంభీర్యమును గలిగియుండు. (గౌరవమునది[illegible]గించును.)[6]

౩౫. గుణము గణనీయముగ నుండవలె.

౩౬. గురుజన భక్తిపూజలు కొనియాడదగినవి.

---

౧ మర్జన సాహాసము  ౪ విడువకు

౨ కఠినపుమాట  ౫ నిందితము

౩ బెదిరించుట మొదలైనవి  ౬ పొందఁదగినది

౮౭. గేహకార్యనిర్వాహశక్తి[౧] బూనుము.

౮౮. గొణుగుట కొఱగానిది.

౮౯. గోప్యములను[౨] గోప్యముగ నుంచు- జరుపు.

౯౦. గోళ్లమురికి కూడదు. (కూరలు పాసిపోను.)

౯౧. గృహమున కరుదెంచిన[౩] యతిథి, భిక్షు కాంక్షలకు గుడుపఁబెట్టుట[౪] గృహిణి[౫] పని.

౯౨. చక్కఁగఁ జల దువ్వి, కొప్పుఁబెట్టుకో (వెంట్రుకలు, వంటపాత్రములలోఁ బడకయుండ)

౯౩. చాడి చెప్పవలదు- చాడీమాటల వినకు.

౯౪. చావునకు భయపడఁ గూడదు-(పుట్టుట గిట్టుటకు.)

౯౫. చందనాంగికిఁ[౬] బ్రశస్తాభరణము సుగుణము.

---

౧ ఇంటిపనుల నెఱవేర్పు సామర్థ్యము.
౨ రహస్యములను
౩ వచ్చిన
౪ అన్నముఁబెట్టుట
౫ ఇల్లాలు
౬ స్త్రీకి

౧

౯౬. చిత్రమును దంభవ్యక్తులకుఁ జేర్పకు.

౨

౯౭. చిత్రాంగి యని చెప్పఁబడరాదు.

౩

౯౮. చిత్రము దుర్వ్యక్తులఁ జేరనీకు.

౯౯. చెప్పినవెంటనే చేయుము.

౧౦౦. చెంబువదెలల, సొట్టలుపోఁగొట్టకు- (అప్పుట పైలచేరు)

౧౦౧. చెంబుఁబట్టికొని చెట్లమఱుఁగున కరుగకు-(పోకిరీలు చూతురు. ఇందుకే ౧౫ వవాక్యమును)

౪

౧౦౨. జగదీశ్వరుని జను లారాధింపవలె.

౫

౧౦౩. జానకీపతి భజన, చందలాంగులును జేయఁదగు.

---

౧ దంభాచారములకు

౨ రాజరాజనరేంద్రుని చిన్న పెండ్లాము- అతి దుష్టురాలు, మహాసా హసికురాలు.

౩ చెడ్డనడవడులను

౪ సేవింపవలె

౫ రామునియొక్క- (ఇష్టదైవముయొక్క-)

౧౧౨ మాఁరదిండి తనము మాష్యము.

౧౧౩ ద్రౌపది పాతివ్రత్యము తన్మానమును గాచె - (దుశ్శాసనుఁడు చీరలొలువ)

౧౧౪. దేవతాభక్తియుక్త పతిసేవగలది, పరమపతివ్రత.

౧౧౫. దొంగతనముఁ జేయకు - (పట్టుకొన్న, రహస్యముగనైనఁ గొట్టుదురు)

౧౧౬. ధర్మకార్యమును నిర్మలబుద్ధితో నిర్వహింపు.

౧౧౭. ధవుని మించిన దైవము లేదు.

౧౧౮. నయయుతముగ[1] భాషింపు.

౧౧౯. నాథుననంతరము నారాయణుని భజింపు.

౧౨౦. నియత గృహకార్యముల నిర్వహింపు.

౧౨౧. నియతకాలముల నిజవిభునిఁ జేరు.

౧౨౨. నిందఁ జెందిన[2] సుందరి[3] కంది కుందు.

౧౨౩. నిందలేనియిందువదన నెమ్మిఁజెందు.

౧౨౪. నీతి ఖ్యాతి భీతి బంధుప్రీతి మృదురీతి[4] పాతివ్రత్యంబు ప్రాఁకుపందిలి.

---

౧ నీతితోఁడఁగూడి యుండునట్లు. ౨ బాధపడి ౩ దుఃఖించు

౧౩౩. పతిసేవ నేమఱని[౧] సతిని వాక్పతియైన[౨] నుతింపలేఁడు.

౧౩౪. పతి, భుజింప భుజింపు- దుఃఖింప దుఃఖింపు- సంతోషింప సంతోషింపు - ప్రోషితుఁడైన[౩], మలిన[౪]త్వ కృశత్వముల[౫]ఁ జెందు.

౧౩౫. పతిమన్నన కుబ్బదు[౬]. అవమానించిన స్రుక్కదు[౭].

౧౩౬. పతితెచ్చినది కొంచెమైనను గొప్పగ నెంచు.

౧౩౭. పతికెదురాడినసతి పాపమున కొడిఁగట్టు-

౧౩౮. పతిమాట వినని యువతి బాధలకు లోఁబడు- (ముందందఱు తిట్టుదురు)

౧౩౯. పతిమతిఁ జెందిన సతికి బ్రహ్మయైన భయపడు

౧౪౦. పతియనువర్తనము సతికన్నివ్రతములలో హెచ్చు.

---

౧ మఱవని

౨ బ్రహ్మ

౩ మఱియొక యూరికిఁ బోయినవాఁడు.

౪ సొగసు చేసికొనమి

౫ చిక్కిపోవుట

౬ సంతోషింపదు

౭ దుఃఖింపదు

# స్త్రీనీతి వాక్యములు.

౧౪౧. పతి శయనింపఁ[౧] బాదములొత్తు - (అంగన కోరు లున్నఁ బోనీ)[౨]

౧౪౨. పతికిష్టమైన ప్రకారముగాఁ బ్రవర్తింపు.

౧౪౩. పతి మేల్కొనకమున్న మేల్కొను - (౨౦౯ వ వాక్యమును జూడుము.)

౧౪౪. పతికిఁ బ్రతికూలకృత్యములఁ[౩] బ్రాలుమాలక[౪] జరుపు.

౧౪౫. పతి, పతిపరులపైనాగ్రహింపఁ[౫] బడినచో శాంతిఁ జేయవలె.[౬] (తిన్నని మాటలచే)

౧౪౬. పనులయెడఁ బ్రాలుమాలకు-

౧౪౭. పలుకు పలుకులు, యుక్తములుగా నుండనీ.

౧౪౮. పల్కులఁ[౭] జూడ్కుల వికారము పనికిరాదు.

౧ పరుండ
౨ పంతుకొను
౩ తెల్లవారఁ జరుపఁ దగిన పనులను.
౪ జాగుచేయక
౫ కోపింప
౬ ఆకోపమును అణఁపవలె
౭ మాటల

౧౪౯. పతి పిలిచిన నన్యకార్యము నెపమున నాలస్యము చేయక చను.

౧౫౦. పతికి సుఖము లేనియప్పుడతివ సౌఖ్యమును గోరఁదగదు.

౧౫౧. పతిభుక్తశేషము[౧]ను బాఱవేయఁగూడదు - (అనింద్యముగ[౨] నున్న.)

౧౫౨. పతివ్రతకుఁ గోపము పనికిరాదు.

౧౫౩. పతివ్రత, పతిసహితముగఁ బతితపావనుని[౩]ఁ జేరు.

౧౫౪. పతికహితమొ[౪]నర్పుపడఁతి కీర్తికి బరువు.

౧౫౫. పనికేగి మఱలిన పతిఁబాద్య[౫]పీఠభోజనంబులిడు.

౧౫౬. పతి యన్యాసక్తుఁడైనను[౬], సతి వికృతిఁజెందఁగూడదు.

౧ తినఁగామిగిలినది అన్నాదికము. ౪ అనిష్టము
౨ దూషింపఁబడనిదిగా ౫ కాళ్లు గడుగుకొన నువకము.
౩ భగవంతుని ౬ పరస్త్రీయందాశగలవాఁ

౧౫౭. పతిలేనపుడితరపాలకురాండ్ర[1]దండ[2]఼బడియుండు
(అటుగాకున్నఁ బలికులు పాపచింతఁ జేయుదురు.)

౧౫౮. పరానురక్తి పాపమునకు మూలము, నరకము నకు మార్గము.

౧౫౯. పరులతోఁ బల్కవలసినఁ బరువుఁ[3] జూడు.

౧౬౦. పరపురుషునికీర్తివర్ణించుట పతివ్రతకుఁదగదు.

౧౬౧. పండ్లు ఫక్కుఁగఁ దోముకొనకు.

౧౬౨. పాడిపశువుల పరామర్శ పడఁతుల పని.

౧౬౩. పాత్రములఁ బగులఁగొట్టక, పదిలముగ వాడు-
(నిత్యము నీళ్లకడవఁ బోఁగొట్టిన రొట్టు-)

౧ అత్త, తోడికోడలు, తల్లిమొదలైనవారు.
౨ దగ్గఱ
౩ గౌరవము

౧౬౪. హానము పగవారికైన బాగుగాదు-

౧౬౫. పిలువని[౦] పేరంటమునకుఁ బోకు-(పేర్మి[౧]చెడు)

౧౬౬. పిల్లలఁ జక్కఁగఁదిద్దు-(తీర్పనపుడు-ఎవతె[౨] కనె నందురు.)

౧౬౭. పిల్లజాడ సరిగామి తల్లికి[౩] మాటఁ దెచ్చు.

౧౬౮ పిండివంటలఁ జేయ నేర్చికో-(ఉన్నమట్టుకు చేసికొనవచ్చు)

౧౬౯. పెద్దలుచెప్పినట్టువిను-(వారు నీమేలు గోరువారుగాన)

౧౭౦. పెద్దలతో వాదులాడకు-(గుడ్డువచ్చి[౪]పిల్లను వెక్కిరించె నందురు.)

౧౭౧. పుట్టినింటనుంటకంటె నత్తింటనుంట చాలమేలు.

౦ నీకు నిమిత్తములేని
౧ గౌరవము (పనికి.
౨ ఆరోగ్యాలు
౩ నింద

౪ ఏమియుం తెలియనిది తనకంటెఁ దెలిసినవారికి బుద్ధిఁ జెప్పవచ్చెనని నిందింతురు.

## స్త్రీ నీతి వాక్యములు.

౧౭౨. పుత్రులకుఁ జదువుఁ జెప్పించు- (వేరెవరును లేకపోయిన,)

౧

౧౭౩. పెదవి దాటి నవ్వకు.

౧౭౪. పేదలకని యిచ్చినందులో నేదియుం దాఁపకు.

౨

౧౭౫. పురుషుఁడు కోపింప, నతని యనురాగముగా

౩

నొదుఁగు-

౧౭౬. పురాణములన్ని, సతికిఁ బతియే గతియను. (వేఱొలనీకు)

౧౭౭. పైపై యోగ్యత, లోలో నయోగ్యత గల పడఁ

౪

తుల రోయు-

౧౭౮. పొగచుట్టలఁ బట్టకుము. పొగాకు నమలకుము. (తమ[illegible] ము నధికముగఁ దగదు.)

౧ పకపక వికవిక      ౩ అణఁగియుండు

౨ ప్రియము      ౪ ఏవగించు- త్యజించు

౧౭౯. పొడుగు బొంతుల నిడకు- (నిచ్చెనకుఁ బనిలేక)

౧౮౦. బంధుహిత పరిణయాదులకు[౧] భర్త్రాజ్ఞతో[౨] నేగు- (అధ్యక్షరక్షతో)

౧౮౧. బాంధవుల పరామరిక బాగు.

౧౮౨. భర్తృద్రవ్యమునకు భార్య రక్షకురాలు.

౧౮౩. భర్తకుఁ బ్రతిష్ఠఁ గలిగించునది భార్య.

౧౮౪. భర్త పిలిచినంతనే భార్య పలుకవలయు.

౧౮౫. భర్తృశుభాభివృద్ధి, భార్య గోరవలయు-

౧౮౬. భర్త త్రావని[౩] పేయము, భుజింపని భోజ్యము,[౪] భార్య కగ్రాహ్యము[౫]-

౧౮౭. భర్తయనుమతిలేక బంధువులకేదియు[౬] నీయకు.

---

౧ పెండ్లి మొదలైన వానికి
౨ పెనిమిటియాజ్ఞతో
౩ నీరు మొదలైన త్రాగఁదగినది
౪ అన్నము మొదలైన తినఁదగినది
౫ పొందరానిది
౬ ఏవస్తువును

౧

౧౮౮. భర్తృపరిచర్యయే భార్యకు ముఖ్యకృత్యము-(అన్య కార్యము లేవియు దానితో సమానములుగావు)

౧౮౯. భర్తకు సాటి భర్తయె.

౧౯౦ భార్య లెందఱైనం గావచ్చు, భర్త యొకఁడే.

౨

౧౯౧ భార్యానుగుణము భర్త కగణితధనము.

౧౯౨ భార్యాపకీర్తి భర్తనంటు - భర్తపకీర్తి భార్యకు వచ్చు.

౧౯౩ భార్యాపాపము భర్తనంటు - భర్తృపాపము భార్యనంటదు.

౧౯౪. భార్య, భర్తృసన్నిధానమున నుండవలయును.

౩

౧౯౫ భైక్షవర్తనుల నుపేక్షసేయకు

౧౯౬ మగఁడు పరభాషణమునందు, మగువ తానొకటి చెప్పఁదగదు.

---

౧ సేవయు

౨ లెక్కలేని ధనము

౩ భిక్షముచేత జీవించువారిని.

౧౯౭. మగఁడింటికని యిచ్చిన ధనమును మగువ యుక్తవ్యయమునర్చి[౧] శేషమును దాఁచవలయు.

౧౯౮. మగనిని దెగడకు[౨] - (అల్పసంపాదకుఁడని)

౧౯౯. మంచిపాటల నేర్చికొను.

౨౦౦. మంచిముగ్గులఁ దీర్పు[౩]

౨౦౧. మగఁడులేనిచోట మనికి, మగువకుఁ దగదు.

౨౦౨. మగువ, యొక మంత్రి మగనికి.

౨౦౩ మగనికొఱగామిని[౪] మగువమూన్పవచ్చు[౫] - (పద్మినాగగేహినివలె.)

౨౦౪. మగనిని దెగటుగ[౬] మాటాడిన మగువకు నధోలోకప్రాప్తి.[౭]

---

౧ మిగిలినది

౨ దూషింపకు

౩ ఉండుట

౪ లోపమును

౫ ఒకసతి, గర్వితురాలై యతిథిని నాదరింపని భర్తను మంచి మాటలచేఁ జక్కఁబఱచి యయ్యతిథి నతనిచేతనే సత్కరింపించెను.

౬ అప్రియముగ.

౭ నరకప్రాప్తి

# స్త్రీనీతివాక్యములు.

౨౦౫. మగనిమనసు చిన్నఁబోవనియటుల మసలు.

౨ ౩

౨౦౬. మగఁడెట్టివాఁడైనను, మగువ మనోవాక్కా-

౪

ర్మల, నతని మాననీయునిఁగ నెంచవలె.

౨౦౭. మాటలతేట, అంగవిలాసము, చక్కనిచూడ్కు-
ల-వేయిచోట మాని విభునియెదురఁ బ్రకటింపు.

౨౦౮. మానముఁగల సతికిఁ బతియె మహాభూషణము.

౨౦౯. మేల్మిన్నపతియెదుట, కుంకుమధారణతో
మెలఁగు.

౨౧౦. మొగముఁద్రిప్పుట కొఱగామి!

౨౧౧. మోవి విఱచుటయు నట్లే.

౫

౨౧౨. ప్రత్యుత్తరమునకు నిగ్గయ, బధిరత్వ మూకత్వము
లు పొందు.

౧ చింతఁజెందనట్లు.
౨ అంగహీనుఁడైనను, అప్రయోజకుఁడైనను.
౩ తలంపు, మాట, పని వీనిచే
౪ పూజనీయునిఁగా
౫ బాధిర్యమూకత్వములు; చెవుడు, మూగతనములు.

౨౧౩. యాచనకంటెఁ[౧] గష్టజీవనము మేలు.

౨౧౪ యాచనమీఁదఁ జేసినపని చేకూఱు[౨].

౨౧౫ రత్నాంగి[౩], మెన్నికకుఁ దగిన రాణి.

౨౧౬. రూపలావణ్య[౪] విద్యా విభవ

బోటి విభునిమాట దాఁటఁదగదు.

౨౧౭. లంచముఁ గొనకుము[illegible]

౨౧౮. వచ్చినచదువును మఱవకు- వచ్చినధనమును వె[illegible]

పకు (ఉన్నది పో[illegible]న, బాగా.)

౨౧౯. వద్దియాశ, ముద[illegible]చునన్న సాక్షిత

నెఱుఁగవా.

౨౨౦. వంటలో నేమఱకు- (మ[illegible]

౧ వేఁడుకొనుట
౨ సిద్ధించు
౩ రాజరాజనరేంద్రుని పె[illegible]భార్య.
౪ చక్కఁదనము, వయస్సు.

౨౨౯. సపత్నులఁ[1] బ్రత్యక్షపరోక్షముల[2] నిందింపకు.

౨౩౦. సదనోపకరణ సంస్కారణమును[3] వెదకు.

౨౩౧. సంసారము గుట్టు, వ్యాధి ఱట్టు.

౨౩౨. సవతులలో, మాత్సర్యా[4]మర్ష గర్వ కలహము లుండఁ గూడదు.

౨౩౩. స్వదుర్గుణము లెంచి, పరదోషములఁ బాటింపు.

౨౩౪. సంయమములు యోగతపస్సులచేఁ బొందుగతి, పతిని భజించు సాధ్వికి- సాధారణముగఁ గలుగు.

౨౩౫. సీతపాతివ్రత్య, మగ్నిని శీతలునిఁజేసి- (అగ్ని ప్రవేశమయమున)

౨౩౬. సీమంతినికి, సింహాసనలాభ మెక్కడనో-

---

౧ సవతుల

౨ ఎదురను, మఱుఁగు నను.

౩ గృహోపకరణములను బాగుచేయుటను.

౪ పరులమేలోర్వమి

౨౩౭. సుగుణురాలైన సుదతి, సుపుత్రునిఁ గను.

౨౩౮. సుగుణభార్యఁగల మగనియిల్లు, సుఖాధారముగ నుండు.

౨౩౯. సురకిన్నర గంధర్వాసుర విద్యాధరుల నైనఁ బతియసన్నిధిని జూడకు.

౨౪౦. సంసారమున గృహిణియే సారము, అది లేమి నిస్సారము.

౨౪౧. సకాలస్నానముఁ గావింపు.

౨౪౨. హరిస్మరణ నంతరంగమందుంపు.

౨౪౩. హితాహితముల, యోచింపు.

౨౪౪. హెచ్చుచదు వబలలకెందుకు.

౨౪౫. క్షుద్రదేవతలఁ జూడకు.

స్త్రీనీతివాక్యములు-

ముగిసెను.

శ్రీరస్తు.

---

# సతీహిత సంగ్రహము.

## ప్రథమ భాగము.

## సావిత్ర్యుపాఖ్యానము.

వ॥ మునీంద్రా పతిభక్తి తాత్పర్యంబున నఖిల లోకంబుల గెలిచి శుభంబు నొందిన పుణ్యసతీచరిత్రంబు వినవలతుం జెప్పవేయని (యుధిష్ఠిరుం డడిగిన) నతనికి మార్కండేయుండు సావిత్రియను రాజపుత్రి చరిత్రంబు వినుమది నీ ప్రశ్నంబునకు నుత్తరంబగునని యిట్లనియె॥

సీ॥ కలఁడు మద్రేశుండు ఘనుఁ డశ్వపతి యను ధరణీశుఁ డతఁడు సంతాన కాంక్ష । నెంతయు ధృతిఁ బదునెనిమిది యేఁడులు సావిత్రిఁ గొల్చె సజ్జనవిభునకు । నద్దేవి ప్రత్యక్షయై వరమడుగుము నావుడు నతఁడు వినమ్రుఁ డగుచు । నాత్మజుఁ గోరెద ననవుడుఁ గన్నియ పుట్టును కనియె నా భువనమాత । యనుడు దేవి భవత్కృప నస్మదీయ । వాంఛితము సఫలంబు గావలదె యని నృ । పోత్తముఁడు విన్నవింప నయోగ్యమూర్తి । గాఢకారుణ్య వికచ హృత్కమల యగుచు ॥

వ|| ఏను నీ మనోరథంబు తెలంగు మున్న చతుర్ముఖున కెఱింగించిన నతండును గన్నియగా నిర్దేశించె నద్దేవుని యానతి యమోఘంబు విను మక్కన్నియ కారణంబున నీకు నుక్కు విధంబునం బిదపం బుత్త్రశతలాభంబు సంభవించునని యనుగ్రహించి యద్దేవి యంతర్ధానంబు నొందె నయ్యశ్వపతియును సావిత్రీ ప్రసాదంబున నిజ పత్నియైన మాళవియందు సావిత్రియను కూఁతుంగని యక్కన్నియ నతి గౌరవంబునం బెనిచె నంత ||

క|| ఆవనజాక్షి పరిస్ఫుట । యౌవనయై సిద్ధ
సాధ్య యక్షామరక । న్యావలిఁ దన సౌందర్య । శ్రీవిలసన
రేఖ నపహసించుచు నుండెన్ ||

తే-గీ|| కోతి జనపతి దన కూఁతుఁ జూచి ।
గుణవయోరూపముల కనుకూలుఁడైన । భర్త నెవ్వాయి
దీనికిఁ బడయువాఁడ । నొక్కొయని యెందుఁ దడవుచు
నుండె నెలమి ||

వ|| అదియు సాళ్వపతియైన ద్యుమత్సేనుకొడుకు సత్యవంతుండు రూపవంతుండనియును గుణవంతుండని యును విని వానియందుఁ జిత్తంబు దగిలియున్నను సిగ్గు చెంపున నెవ్వరికిఁ దెలియింపకుండె నంత నొక్కనాఁడు మద్రపతి కడకు నారదుం డరుగుదెంచిన నతం డప్పుడా

మునిఁ దుచిత సపర్యావిధులం బరితోషితుం జేసి సద్గోష్ఠీ
విశేషంబులు సలుపుచున్నయెడ ||

క || నెచ్చెలులు దన్నుఁ గొలువఁగఁ । బచ్చవిలుతు
కలిమి యెల్లఁ బద్మానన యై । యచ్చపడినట్లు మెఱయుచు ।
నచ్చటికేతెంచె భూవరాత్మజ నెమ్మిన్ ||

వ || ఇట్లు వచ్చి సఖీజనంబుల నంతంత నిలిపి మెలపు
తోడి పొలుపున నమ్రగుణ లీలామధురంబుగఁ దండ్రికి
దండప్రణామంబు సేసిన నతండు ప్రగాఢ స్నేహ సన్నాహ
దోహలంబగు చిత్తంబుతో నత్తన్విం గ్రుచ్చియెత్తి నిజాం
కతలంబున నునిచికొని సముచితోపలాలన కేళిపరవశుం
డయ్యె నప్పుడు నారదుండు దద్ముగ్ధియం జూచి యశ్వపతి
తోడ నిక్కన్నియం దగిన వరున కొసంగక యిట్లేల
యునిచినవాఁడ వనిన నతండు దాఁతున కిట్లనియె ||

తే - గీ || తల్లి నీగుణరూప వృత్తములకెంతుఁ ।
దగిన వరు నీవ యిమ్ముగఁ దడవి నెమ్మి । నీదు మనసున
కెక్కిన నృపకుమారుఁ । గోరి వరియింపు మిదియ నాకుఁ బ
్రియంబు ||

వ || అనిన నదియును గొండొక లజ్జించి కోర్కి
వెంపున నిగ్గుఁ దలంగం ద్రోఁచి ప్రకట కౌతూహల తరళి
తాంతరంగ యగుచుఁ దండ్రికిట్లనియె ||

క || చిరకీర్తి సాళ్వభూవరు । వరతనయుం డైన

సత్యవంతుఁడు నామమునఁ । వరుఁడుగఁ గోరెదమని లో । నర
వర యూతనికి నిక్కు నసుఁ బ్రీతిమయిన ॥

వ ॥ సావిత్రియును నిపుడు దైవయోగంబునం
జేసి గతచక్షుండై తనరాజ్యంబు వైరులచేతం గోలుపడి
పుత్రదార సహితంబుగ వనంబున నున్నవాఁ డెట్లైన,
సత్యవంతు వరియింతు ననిన మద్రేశ్వరుండు నారదుం
జూచి మునీంద్రా మీయెఱుంగనివారు లేరు సావిత్రిచేత
వరియింపంబడిన కుమారుం డెట్టివాఁడు వాని గుణస్వభా
వంబు లెఱింగింపుఁ డనిన నారదుం డిట్లనియె ॥

సీ ॥ సత్యంబ పలుకుట సత్యవంతుండన నతఁ
డొప్పు మఱియుఁ జిత్రాశ్వుఁ డనఁగ । నాహూంచరంబు
సన్నరనాథ సుతుసమఁ గలఁడు తేజంబునఁ గమలమిత్రు ।
బుద్ధినింద్రాచార్యు బరఁగించు శూరత వాసవుఁ దాఁటు
వసుధఁబోలుఁ । గాంతిఁ జంద్రునకెన గాఁదగు రూపున
నాశ్వినేయుల సరియనఁ దలిర్చుఁ । దపము శమము దమము
దానంబు బ్రాహ్మణ । భక్తియును మహాప్రభావతయును ।
సతనియందకాని యన్యులయందు లే । దింతనిమ్యూవము
మహితలేశా ॥

వ॥ వానియందును గీడొక్కటి గలదు పరిణయంబు
మొదలుగా నొక్క సంవత్సరంబునకు మృతిఁబొందు నది
నీకుఁ జెప్పవలయుటంజేసి చెప్పితి ననిన నతండు నాఁకు

మొగంబు సూచి తల్లీ యిమ్మహాత్ముండు దేవ రహస్యం
బెఱుంగు నీయనవచనం బమోఘంబు నీకు నట్టి వరుం
డేల యొండొక్కవరుని వెతకికొమ్మనిన నక్కన్యక యి
ట్లనియె ॥

క ॥ వినుము మనోవాక్కాయము । లనుమూఁ
డుదెఱంగులందు సంతీకరణం । బనఘ ప్రధానము గా
వున । మనమునఁ గైకొన్న భర్త మానంచగునే ॥

వ ॥ సత్యవంతుం డెట్టివాఁడైనను నగుంగాని
నేనింక నొరుల వరియింప నొల్లననిన నశ్వపతి నారదు
దెసఁ జూచుటయు నతం డిట్లనియె ॥

చ ॥ గొనయుల ప్రోగు నీయనుఁగు కూఁతురు దీని
తలంపు మాన్పఁగా । మనకు నశక్య మింక ననుమానము
వేల నరేంద్ర యింతిఁ జ । య్యన నృపసూతికిమ్ము కమలా
సన చేసిన పుణ్యగౌరవం । బున నయినం బ్రియుండు పరి
శ్రాగ్న చిరాయురుపేతుఁ డయ్యెడున్ ॥

వ ॥ అనిన నమ్మహీపతి మునిపతికి మ్రొక్కి నీవు
మాకుం బరమగురుండవు మీ యానతిచ్చినట్ల చేసెద ననిన
నారదుండు వారి దీవించి దివంబునకుం జనియె నంత ॥

సీ ॥ అపురఁ బుణ్యదినంబునందు బాంధవ మంత్రి
వృద్ధ పురోహిత వితతితోడ । సావిత్రిఁ దోడ్కొని జననాయ
కుండు వైవాహిక మహనీయ వస్తుకోటిఁ । గొనుచుఁ బు

ణ్యారణ్య గోచరుఁడై తపస్వితుఁడైన యాద్యుమత్సేను
కడకు । చనిన నారాజును సంభ్రమంబున నశ్వపతికి
నర్ఘ్యాది సంభాషణంబు । లాచరించి సముచితాభిమతా
లాప । పూర్వకముగ సుజనపూజ్యుఁ డతని । యాగమన
నిమిత్త మడిగిన మద్రేశుఁ । డెలమి సాళ్వపతికి నిట్టు
లనియె ॥

క ॥ ఈకన్నియ నాకూఁతురు। మాకులమున కెల్లఁ
దెప్ప మనుజోత్తమ నీ। కీకన్నియఁ గోడలిఁగాఁ । నైకొను
ము మదీయవచన గౌరవబుద్ధిన్ ॥

వ ॥ అని పలికి సావిత్రి నతనికి నభివందనంబు
సేయించి మఱియు నతండు ॥

క ॥ నీకొడుకు సత్యవంతుఁ । డీకన్నియ దగు
నరేంద్ర యీకన్నియకున్ । నీకొడుకు దగు ననన్యగు।
ణాకరు లియ్యిరువురును సమంచితమూర్తుల్ ॥

వ ॥ అనిన నతనికి ద్యుమత్సేనుం డిట్లనియె॥

తే- గీ ॥ విగతరాజ్యులమై ఘోరవిపినములకు ।
వచ్చి యిక్కాయఁ దపమున్నవారమేము । బాల సుకు
మారి యిది జనపాల యడవి। నుండి మాతోడి యిడుమల
కోర్చునయ్య ॥

వ ॥ అనిన నశ్వపతి యతని కిట్లనియె ॥

వ ॥ కలిమియు లేమియుఁ సతము గావవి చెం
దినచోఁ జెలంగుచుఁ । గలఁగుచున్నని ధీరుల ప్రకార
ము లెస్స గనింతవట్టు నేఁ । దెలియుదుఁ జెప్పెద న్వసుమ
తీవర విన్న యనంగ నేల యే। కొలఁదియుఁగాదు ధీరమతి
మాఁతురు పేర్కొనఁ జాలుఁ జెంపునఁ ॥

క ॥ నీతోడ వియ్యమందం । జేతోగతి నాసఁజేసి
చెచ్చెర సిట్లో। నాతెంచితి మహాప్రిగ్ధన । బ్రాఁతిగఁ జేకొనక
యునికి పాడియె నీకుఁ ॥

వ ॥ అనుటయు నయ్యంధ నృపతి తత్సంబంధము
నకు సంతసిల్లి నిజాశ్రమవాసులైన మునులం గూర్చికొని
శుభలగ్నంబున సత్యవంతునకు. సావిత్రిం బరిణయంబు
సేసె నయ్యశ్వపతియునుం గూఁతునకు నల్లునకు వివి
ధాంబ రాభరణాది వస్తువు లొసంగి నిజపురంబున కరిగెఁ
బదంపడి ॥

తే- గీ ॥ వణఁతి రమణీయ భూషణాంబరవిలాస ।
ముజ్జగించి వనాంతరయోగ్యలీల । వల్కలాజినవసనయై
వదల కధిక । భక్తిభర్తృశుశ్రూషణ పరత నుండె ॥

క ॥ ఆమెలఁత నేయు సువినయ । సామగ్రుల
మృదుగభీర సంభాషణలఁ। మామయు నత్తయు సంతో।
షామృతమునఁ దేలి రంతరంగములఁ దగఁ ॥

వ ॥ సావిత్రియుఁ దనమగని యాయుఃప్రమా

ణంబు నారదముని చెప్పిన దినంబు మొదలుగా ననుదినం
బును లెక్క యిడికొనుచు నిట్లు వర్తిల్లుచుండ నాలుగు
దివసంబులు గొఱంతగా నొక్క సంవత్సరంబు గడచిన॥

క ॥ నాలవదినంబు పతిమృతి । కాలంబని మది
నెఱుంగి కడునిష్ఠమెయిన్ । జాలం భరంబుగఁ బూనెను ।
బాల త్రిరాత్రోపవాస పరమవ్రతమున్ ॥

వ ॥ దానికి విస్మయంబంది ద్యుమత్సేనుండు
కోడలిం బిలిచి తల్లీ యిట్టుల దుస్తరంబగు వ్రతంబుఁ
దొడఁగితి వనిన నశ్వపతిరాజనందన వినయంబుతో
నిట్లనియె ॥

క ॥ మీరు మదీయంబగు వ్రత । భారమునకు వగ
వలదు పరమశుభంబుల్ । గోరి వ్రత మిది బూనితిఁ । గార
ణమును మీకెఱుంగఁ గానగుఁ బిదపన్ ॥

వ ॥ అనిన నతండ్లైన మేలుగాకయనియె నంతఁ
జరుగ్గుదివసంబున ॥

సీ ॥ కడు రేఁపకడన మేల్కాని నిజభర్తకు మరణ
దినంబని మానసమునఁ । దద్దయు శోక సంతాపంబు గదు
రంగ దినముఖోచితవిధుల్ దీర్చి భక్తిఁ । బతికి సముంచిత
పావనపరిచర్య యప్పుడు శుశ్రూష యాచరించి । అత్త
మామలకును నచటి వృద్ధులకును వేర్వేర ప్రణమిల్లి వేడ్క
వారు । తనకు సౌభాగ్య మధికవర్ధనము గాఁగ । నిచ్చు

దీవెన మదిలోఁ గ్రహించి యుండఁ । బ్రొద్దుజామెక్కుట
యుఁ బూజ్యబోణిఁ బిలిచి । మామ యిట్లని పలికె సన్మాన
మొసఁగ ॥

క ॥ కడు నుగ్రంబగు వ్రతమిది । వాడఁగిరి దివ
సత్రయంబులో నది సెల్లెఁ । బడఁతీ మెంతయు డస్సితి ।
తడయక పారణము నర్పఁ దగదే యింకన్ ॥

వ ॥ అనిన సావిత్రి యతని కిట్లనియె ॥

ఆ- వె ॥ అధిప ప్రొద్దు గ్రుంకు నంతకు నేడును ।
గుడువఁ దగదు నాకుఁ గోరి యిట్లు । గాఁగ వ్రతముఁ
బూను కాలంబు నన నేను । నిశ్చయించుకొనిన నియమ
మిదియు ॥

వ ॥ అనియె నవ్వుడు సత్యవంతుండు సమిత్కుశ
ఫలాహరణార్థంబు వనంబునకుఁ గదలినం జూచి సావిత్రి
చేరంజని వనంబునకు నీతోడఁ జనుదెంతుఁ దోడ్కొని
పోవలయు ననిన నతండు నీవు త్రిరాత్రోపవాసంబునం
జేసి మెంతయు డస్సినదానవు రానోప వనిన నత్తన్వి
యతని కిట్లనియె ॥

ఉ ॥ ఉపవాసశ్రమ మించుకేనియును నాయు
ల్లంబునం దోఁపదు । విపినం బుజ్జ్వల పుష్పపల్లవ ఫలా
విర్భూత నానాలతా । గవరితంబని వింటఁ జూడఁగ మదిం

గాఢమోహంబు విడ్వ్యన, స్నేహ రోధింపక నింతవట్టు వసుధి
యుక్తుండ నెబ్బంగులన్ ॥

వ ॥ అంతం దప్పనాకయని రప్పనుటయు సావిత్రి
పయ్యనం జని భార్యాసహితుండై యున్న రామకుఁ బ్రణ
మిల్లి మీకొడుకు వనంబునకు నగ్నిహోత్రార్థంబై సమి
ధలు దేర నరిగెదు నాకును నతనితోడఁ జని వనంబుఁ జూ
చుటకు వేడ్కయయ్యెడు మీరు నాకీవ్వరంబుఁ గృపసేయ
వలయుననిన నతం డిట్లనుఁ. నెన్నండును నెయ్యదియును
నడుగ దిత్తెఱంగు దీనికిఁ బ్రియంబై యున్నది నాకు
నివారింపఁగూడదని తలంచి యనుమతించుటయు నయ్యి
రువుర యరుగులంబడి రిట్లని ॥

క ॥ చిత్తంబున నై కొనియెడు । నుత్తలము నడంచి
ముఖపయోరుహమునఁ ద । యోత్తిరెడు జడ సత్యవఁ
ప్రియ । చిత్తం బిగుకొత్తఁ జనియెఁ దెలువ యడవికిన్ ॥

వ ॥ ఇట్లా దంపతులు మందగమనంబునఁ బరిస
రారణ్యంబు దరియం జొచ్చి రప్పుడు ॥

సీ ॥ కమనీయ కమలినీ కల్లోల వీథులఁ గదలురా
యంచల గతులతోఁ బన్ను బహు పుష్ప పల్లవ ప్రకర చిత్రి
తములై తనరారు తరులతా తతులసొంపు । మకరంద
రస పాన మదవిలోలంబులై గ్రాలెడి తుమ్మెదల గముల

యలిపుఁ బరిపక్వ మంజుల ఫలరసోద్ధతముపై పలుకు రా
చిల్కల పటురవంబుఁ । బ్రియుండు వేరువేర బ్రీతిగాఁ
జూపుచుఁ జెప్పుచును జనంగఁ జిగురుబోఁడి । కనుచు
వినుచు నిర్వికార సల్లాప మిం । పార నతని తెలుఁగు
సరయుచుండె॥

వ॥ తదనంతరంబ యా రాజనందనుండు మధు
రంబులగు ఫలంబులఁ గోయుచు నరిగి గరిడియ నిండించి
యొక్కయెడఁ బరశుపాతంబునం గాష్ఠదళనంబు సేయం
బోడంగి శ్రమంపకి నొల్లంబోయి గొడ్డలి పుడమి వైచి
నిరంతర నిశ్వాసవేగ విషణ్ణవదనుండగుచు సావిత్రిం
గనుంగొని॥

చ॥ ఒడలు వశంబుగాదు భ్రమ నొందినయట్లు
మనంబు దూలెడుఁ । గడఁగి శిరంబు శూల విశిఖ ప్రహా
రంబుల నొంచినట్లు ద । వ్యోడు నిలువంగ నూర్వ నొక
యించుకసేపు శ్రమంబు దీఱ నీ । తొడ శయనింతు
నాప్రియ నిశేషగ మాత్రని సంభ్రమంబుతోఁ॥

క॥ తనయంకతలము ప్రియశిర । మున నుపధా
నముగఁ జేయ భూపతనయుఁ డో । య్యన వ్రాలి సోలి
నిద్రిం । తనుఁదైనట్లుండెఁ గొంతదడవున కెదురన్॥

మ॥ కనియెన్ గోమలి నీలమేఘ విలసత్కాలాం

జనాకారు ఘో। రనిశాతోత్కట దంష్ట్రి సుజ్జ్వలచల
ద్రక్తాక్షు ప్రత్యగ్ర కాం। చన వర్ణాంబరు నంత్యకాల
దహన జ్వాలా ప్రచండుఁ జగ। జ్జన సంత్రాసకు
సుకృ విభ్యుఁ బటుపాశ ప్రాంత హస్తోద్ధతుఁ॥

వ॥ అప్పురుషుండును నధిక సంరంభంబున సత్య
వంతుం గదిసిన నయ్యింతి యుంతయు భయంబునం బ్రి
యునిశిరం బాయ్యన దిగువం బెట్టి నిల్చి కృతాంజలియై
యయ్యా నీవెవ్వ రిచ్చ్యోడకు నెయ్యది సేయం దలంచి
విజయంచేసితి వనిన నతండిట్లనియె॥

సీ॥ కాలుండఁ జావ్వె యేఁ గమలాక్షి నను నీవు
మహిత పాతివ్రత్య మహిమఁ జేసి। కానంగఁ జాలితి కాన
రా దన్యుల కిదె నీదు భర్తకు నిండుకాల। మగుటయు
వీఁడు మహాపుణ్యనిధి గాన నితరులఁ బనుపక యేను వీనిఁ।
గ్రహ్ముఁ గొనిపోవఁగాఁ జనుదెంచితి నని యుగ్రభంగి
నయ్యంతకుండు। ధరణినాథతనయు తనువునఁ బ్రాదేశ।
పరిమితాత్ముఁ దగుచుఁ బ్రజ్వరిల్లు। జీవు వెడలఁ దిగిచి
చెచ్చెర నతిదీర్ఘ। భయదపాశనికర బద్ధుఁ జేసి॥

వ॥ కొని దక్షిణాభిముఖుండై ఘోరం
బగుమార్గంబునఁ జనఁగాఁ జూచి యనంతరంబ మఱియు
సావిత్రి శోకంబు దక్కి। కొనఁ బ్రాణేశ్వరుతోడ యెక్క

యుడ సంగుప్తంబుఁ గావించి యూ । తని పజ్జందగఁ
దాను నేగెఁ బదపద్మంబు లొ్వారిం బొ్రలక ॥

ఆ - వె ॥ దానిఁ జూచి దండధరుఁడు నీవిక్లేల ।
వచ్చెదవు లతాంగి వలదు నిలువు । మింతినీకగమ్య మిట
మ్మీఁది తెరువెల్ల । ననిన నతని కిట్టు లనియెఁ బొలఁతి ॥

క ॥ పతు లెందుఁ జనిన నచటికి । సతులకుఁ జన
వలదె నీ ప్రసాదంబున మ। త్పతి భక్తి కతమునను సం।
స్తుతగుణ నాకరుగరాని చోటులు గలవే ॥

వ ॥ సకల మార్గంబులందును ధర్మమార్గంబు
ప్రధానం బట్టి ధర్మంబునకు నాధారంబు సజ్జనులయని
వినంబడు నట్టి సజ్జన సందర్శనం బెప్పుడును వృథగాదు
గావున సజ్జనశేఖరుండ వనంజను నీదైన సందర్శనంబునం
బరమ శుభంబు గుందక యేను రిత్తజనంబుల తెఱంగున
నూరక యిట్లు మగుడుదు ననిన దాని ప్రగల్భ వచనంబు
లకు నద్భుతింబంది ధర్ముం డిట్లనియె ॥

ఆ - వె ॥ తేనియలతాంగి భవదుదార వాక్యంగికి ।
మెచ్చు వచ్చె నాత్మ నిచ్చవాఁడ। వేఁడు మొక్కఁ వరము
విభుని జీవిత మొక్కఁ । టియును వక్కఁ నేది యయిన
గొందు ॥

చ || అనవుడు మద్రరాజసుత ప్రాంజలియై సప
వత్రితోడ ని ట్లను రిపుకోటిచే నపజయంబును బొంది వ
నాంతరంబునం। దనవరత వ్రతాగ్నిరతుఁ డైన మహాత్ముఁ
డు సాళ్వభూవిభుం। డనఘుఁడు లబ్ధ చక్షుఁడగు నట్టు
లుగాఁ గరుణించవే మదిన్ ||

క || నావుడు నట్టుల యయ్యెడు। నీవిట రావలదు
దుడుగు నెమ్మి నని వెసం। బోవఁదొడంగెను బిత్రుపతి।
యావెలఁదియు నంత నిలువ కరిగెఁ బిఱుందన్ ||

వ || ఇట్లు చని చని మఱియు నిట్లనియె ||

చ || ఎడపక వాఙ్మనః క్రియల నేరిమిఁ హింస
యొనర్పఁ బూనరే। యొడలను దీనులం గరుణ నేర్పడఁ
బ్రోతనై చూతు రిచ్చుచోఁ। గడుపడంగ నీకెదిరి కాం
క్షితము లొదవునట్టి దీర్తురె। తుక్కరుఁ డు మదిఁ గూర్తురా
శ్రితులకు న్వినుము మన్నియు నార్య ధర్మముల్ ||

క || నీవెఱుఁగని యది యెయ్యది। దేవోత్తమ
ధర్మగతుల తెఱఁగెల్ల భవ। ద్భావాధీన మగుటఁ గా। దే
వెలసితి వీవు ధర్మదేవత యనఁగాన్ ||

క || సమబుద్ధితోడఁ జిత్త। త్సముచిత కర్మఫల
సుఖిల జంతు తతులకున్। సమరూర్చుట నీకయ్యెను। సమ
వర్తి యనంగఁ బేరు జగదఖిలమతమై ||

క॥ యముఁడందురు నిన్ను నార్యులు। యమియుం
బుడు భూతతతుల నట్లగుటఁ దగఁ౯ । శమనుండవై లి
కల్మష । శమనంబునఁజేసి నీవు జలజాక్షసుతా॥

వ॥ అనినం బ్రేతపతి యా పుణ్యసతి కిట్లనియె॥

క॥ తృషితుఁ డగువాని శీతల। తుషార తోయ
ముల మోదితునిఁ జేయుగతిఁ౯ । హృషితాంగుఁజేసె
ననుఁగ । కల్మష రహితము లైన నీ సమంజస ఫణితుల్॥

వ॥ కావున సత్యవంతు ప్రాణంబు దక్కఁ
దక్కిన కోర్కె యెయ్యదియైనం జెప్పుము సఫలంబు
సేసెద ననిన సావిత్రి దేవా నైరులచేత నపహృతంబైన
రాజ్యం బెప్పటియట్లు ద్యుమత్సేనుం బ్రాపించునట్లుగా
ననుగ్రహింపవేయని వేడుఁటయు వైవస్వతుం డట్లయగు
నని పలికె యిట్లనియె॥

ఆ-వె॥ వలవదుడుగు మింక వదలక నీభక్తి।
మగని కొఱకె దుర్గమంపుఁద్రోవ। యిది కృతంబులయ్యె
నెల్లవియును నిట్లు। వచ్చు సెలవులేదు వనజవదన॥

వ॥ అనిన నమ్మహాభాగ యతని కిట్లనియె॥

క॥ ధర్మాత్ములు దయసలిపెదు। ధర్మక్రియఁ దప్ప
రెట్టి దశలందు నను మా। మార్గులుఁ బాపముఁ బుట్టవు।
ధార్మిక హృదయములఁ బ్రభను ధర్మాధ్యక్షా॥

సంసర్గమునఁ దీర్ఘ । భూతమతులు వారు భూతలమున ॥

ఉ ॥ వారలపేర్మిఁ గాదె శశివారిజమిత్రులు నిర్వి

కార సం । ధారత నుల్లసిల్లెదరు సర్వపయోనిధులు న్వి

రాజిలు । దారతఁ గ్రాలెదుర్ గులనగంబులు నిశ్చలరూ

పంబులు । మిప్పారెదు భూతధాత్రి నిఖిలైక ధురీణతఁ

జేర్మిఁ బొందెదుర్ ॥

వ॥ అనిపలికి మఱియు నిట్లనియె ॥

తే - గీ ॥ ఏదుమాట లాడినయంత నెట్టివారు ।

సార్వజనులకుఁ జుట్టంబు లగుదురనినఁ । జిరసమాలాప

సంసిద్ధి జేసి నీకు । నేనుఁజుట్టమ ననివేరె యేలచెప్ప ॥

వ ॥ కావున మిత్ర మనోరథం బవశ్య కర్త

వ్యంబుగాఁ జిత్తగింపుమనిన నమ్మహానుభావుం డమ్మానిని

దెసఁ గృపంగొని నీకుఁ బ్రసన్నుండనైతి నీకిష్టంబైన వరం

బొక్కటి యిచ్చెద నడుగుమనిన నమ్మానిని యిట్లనియె ॥

క ॥ పది సత్యవంతు జీవిత। మది యిమ్ము లఁడొ

... యన్యంబుల ని । చ్చెదనని పలుకుదుము నీ।

పది యిప్పుడు లేద యింక నడిగెదఁ బ్రీతిన్ ॥

చ ॥ పతివిరహంబు దుస్సహము భర్తృవినాకృత

నైన కాంత దూ । షితయగు సర్వమంగళ విశేషములం

బును గాన మిత్రియుం । దతులిత కీర్తిశాలి గుణగణా

తమోమయమై యిదె శర్వరీముఖం । బొదవె విడంబనం
ఓపట నెవ్వరు లేరు నరేంద్రనందనా॥

మ ॥ అదె నక్తంచరు లింద్రు నందును మహో
గ్రాకారులై క్రందుగా । మెదలం జొచ్చిరి ఘోరఘోర
వరుతుల్ మిన్నంటెఁ దీవ్రంబులై । పదశబ్దంబులు మీఱెఁ
జూడు గలయం జాలం బొడంగెం జెనుం। గడుపుల్గట్టి
మృగంబు లెంతయు భయోత్కంపంబు నాకయ్యెడిన్॥

క ॥ విను నీవు దడయుటకు మీ । జననియు జన
కుండు గరము సంతాపభరం। బును బొందుదు రింతకుఁ
గ్రే। న్నన వెసఁ జని సంతసం బొనర్పవె యధిపా॥

వ ॥ అని పలికి తదీయ విషాద విచేష్టితంబు లుప
లక్షించి వెండియు ॥

చ॥ తమమును బెల్లుగాఁ బరఁగె దవ్వు నిజాశ్రమ
భూమియు న్మదిన్। శ్రమమును బాయ దిప్పుడను ఛంద
మున్నైనఁ జనంగనేల యిం। పమరఁగ నింతప్రొద్దు గుగు
హాకర యిచ్చట నిల్చి రేపు పో। దము తెలఁగ్రొత్తి నావు
డును దన్వికి సాళ్వతనూజుఁ డిట్లనున్ ॥

క॥ మూని శిరోవేదన నా । మనికిఁ దగ లావు
తప్పె మిల్లనె జరుగం। గానొక్కఁ దల్లిదండ్రులఁ। గానక
యిట్టు నిలుతుఁ గాననసీమన్ ॥

క॥ ఇంతకు మున్నెన్నఁడు నే। నింత వడలు కాఁరఁ

కం॥ నావార్త వినక యింతకు । నావృద్ధులు ఖిన్న హృదయులై ప్రాణంబుల్ । పోవిడుతురు గాకచటికిఁ । బోవం బని గలదె యేను బుచ్చెద ననువుల్ ॥

వ॥ అని బహుప్రకారంబుల విలపించి కన్నీరు నించిన నక్కాంత దుఃఖాక్రాంతయగుచు నతని నాశ్వాసించి నవమృణాళీమృదులంబగు భుజంబులం గౌఁగిలించి మొగయనెత్తిన నెత్తిన లేచి యతండు ధూసరితంబైన శరీరంబుఁ దుడిచికొని గమనంబునకు నుత్సహించిన॥

కం॥ ఫలభారము దుర్భరమని। వెలఁది యచట నొక్కవృక్షవిటపంబున నిడి। తుమ్ముల గరిడియఁ దగిలిచి యు। గ్గలపరశువుఁ గొనుచు మృదుల సంభ్రమరీతిన్ ॥

వ॥ జీవితేశ్వరు వామబాహువు నిజవామభుజంబునిడికొని దక్షిణహస్తంబున నతనిఁ గ్రుచ్చి కౌఁగిలించి మందగమనంబున నాశ్రమదేశంబునకు మగిడె నంత నక్కడ

ఉ॥ కన్నులు వచ్చి మొగ్గెదలు గన్గొని వృద్ధనరేంద్రుఁ డాత్మకుం। గన్నులఁబోలె నైన తన గాదిలి పుత్రుఁడు గానఁబలో। నెన్నఁడులేని యింత తడవేటికిఁ జిక్కెనొ యంచు నార్తితోఁ। గన్నులు లేని యట్లరఁదు గానక యేడ్చె సతీ సమేతుఁడై॥

తరల॥ కొడుకు నిందును నందు రోయుచుఁ గో

ప్రేమ భరంబునం। గొడుకు సద్గుణ కోటు లెల్లను గోటి
భంగుల నోలి ను। గ్గడన సేయుచు సత్యవంతునిం గానరే
మునులార యీ । యడవి లోపల నంచు హా సుత
యంచు ధైర్యము డించుచున్ ॥

వ॥ ఉన్నంతం దదాశ్రమవాసులైన మునులందఱు
నతనిం బొదివికొని తదీయ నయన లాభంబునకు విస్మ
యం బందుచు నుచిత వాక్యంబుల నతని నాశ్వాసించు
చుండిరి తదనంతరంబ యొక్క ముహూర్తంబునకు
సావిత్రీ సహితుండై చిత్రాశ్వుండు చనుదెంచిన నావృద్ధ
దంపతు లత్యంత హర్షంబున నతనిం గౌఁగిలించుకొని
మూర్ధాఘ్రాణంబు సేసిరి మునులు సంతసిల్లి రప్పుడా
రాజర్షిముఖ్యుండు పుత్రునిం జూచి యయ్యా యిట్లేల
దడసితివని యడిగిన నతండును దానుం జని పండ్లుగోయు
టయును గాష్ఠ దళనంబు సేయుటయుం దలనొప్పి గదిరి
నిలువనోపక విశ్రమించుటయుం దన్నొక్క పురుషుండు
గలలోన నిగ్రహించుటం జెప్పనెడ సావిత్రి మామ కిట్ల
నియె ॥

సీ॥ ఈ రాజపుత్రున కీదినంబున మరణం బని
మును చెప్పె నారదుండు। ముని నాథువచనం బమోఘంబు
గావున నే మఱి యేను నేఁ డితనితోడ। నడవికి నేఁగితి నతఁడు
నీరసుఁడు సుప్తుఁడై యున్నయెడ వచ్చె నంతకుండు। వచ్చి
యువ్విభుని జీవముఁగొని పోవంగ వెనువెంట భక్తి మునుమీర

ధరాంగి। సత్య ధర్మ ఘనీతి సంస్తుతింటయుఁ గృ। పార్ద్ర
చిత్తుఁడగుచు సజ్జనుండు। నాకు నెమ్మి నొసఁగె నాలుగు
వరములం। దొకట నితఁడు జీవయుక్తుఁడయ్యె॥

వ॥ మఱియు నొక్క వరంబు భవదీయ నయనో
న్మేష కారణంబయ్యెఁ దక్కిన వరద్వయంబునను మీకు
నపహృత రాజ్యంబు సంప్రాప్తియు మదీయ జనకునకుఁ
బుత్ర శతలబ్ధియు నగునని చెప్పిన నయ్యిద్దఱుఁ బరమా
నంద కంటకిత హృదయులై కోడలి కిట్లనిరి॥

క॥ ఆపత్సముద్ర మగ్నం। బై పోయెడు నస్మద
న్వయము వెంపెసఁగఁగా। దేపవయి కడవఁబెట్టిన। నీపు
ణ్యచరిత్ర కీర్తనీయవగు తల్లీ॥

వ॥ అని యభినందించి రప్పుడు మునివరు లందఱుఁ
బ్రశంసావచనంబుల నుపలాలించి వారల దీవించి నిజ
గృహంబులకుఁ జని రంతఁ గతిపయ దినంబులకు॥

సీ॥ ఆసాళ్వభూపతి యాప్త మంత్రులు మూల
భృత్యులు పౌరులు పృథివిఁ గలుగు। పెద్దలు గూడి సంప్రీతి
నాతని పాలి కేతెంచి వినయ సమేతు లగుచు। నవనీశ
నీశత్రుఁ డాత్మీయ భృత్యభేదంబునఁ జేసి బాంధవసహాయ।
సహితుఁడై మృతిఁబొందె సకల జనంబులు నేకచిత్తంబున
నిలుదు నిన్నుఁ। బ్రకట రాజ్య పదవిఁ బట్టంబుఁ గట్టఁగ।
వచ్చినారు నిఖిల వసుధయందు। విస్తరిల్లె నీదు విజయ
ఘోషము భద్ర। గజము నెక్కి వేగఁ గదలు మింక॥

క ॥ ప్రాకట తపోబలంబున । నాకలిత దీప్త సుందరమైయున్న నినుఁగా । లోకేశ చూడఁగంటిమి మా కన్నులు చల్లనయ్యె భాగ్యమునఁగా ॥

వ ॥ అనినం బ్రహృష్ట హృదయులై ద్రుపదపుత్త్రి నందు నతిగుణంబు తదాశ్రమవాసులైన మునుల నభినందించుచుఁ గొడుకునుం దానును గజారూఢులై బహుళ చతురంగ సేనాసంకుల గమనంబునం బురంబునకుం జని సకల మహీరాజ్యంబునుం జైకొని చిత్రాశ్వునకుఁ బ్రీతి యువరాజ్య పట్టం బొసంగి పరమైశ్వర్య ధుర్యుం డయ్యె నిత్తెఱంగున ॥

క॥ తన మగని సత్త్రమామలఁ । జననీ జనకులను దన్ను సకలంబును దా । ఘనముగ సముద్ధరించెను । జనవర సావిత్రి పుణ్య చరితముఁ గంటే ॥

తే - గీ ॥ ఆపతివ్రత యట్లు యీ యాజ్ఞసేని । పరమకళ్యాణ కర్మసంభావనీయ । యధిప మిమ్ము మీయఖిలాన్వయంబు । మగుడ నుద్ధరించు మహాభాగ్యయుక్తిఁ జేసి ॥

క ॥ అనిచెప్పి పాండుతనయుల । ననఘుఁడు వీడ్కొని మునీంద్రుఁ డనుపమ తేజో । ఘనుఁడగు మార్కండేయుఁడు । దనయాశ్రమమునకు నరిగెఁ దప్ప

శ్రీరస్తు.

# సతీహిత సంగ్రహము.

రెండవ భాగము.

## పుణ్య సతీ ప్రభావము.

సీ॥ సమధిక దర్ప దుర్ణయులై నిగిడెడు నింద్రి
యంబులఁ గుదియించి తెచ్చి । మనసు పొందున నిడి
మనసహంకారంబు వజ్జకుఁ గాని సద్వృత్తియుక్తి । నెర
యంగ ననిశంబు నిజభర్తృ శుశ్రూషయందు సమాహిత
స్వాన్త యగుచు । నఖిల లోకోత్కృష్ట యని ముఖ్య నా
హింతు నరయఁ బతివ్రత లయినవారి । చరిత మత్యంత
భవ్య మాహాత్మ్యంబు కరము । ఇహపరంబులఁ గాని నిర్ఘాత
మతిత । యట్టి నారుల విన వేడ్కయయ్యెఁ జెప్ప ।
వలయు పుణ్య సతీ ప్రభావంబు నాకు॥

వ॥ అని ధర్మరా జడిగిన మార్కండేయుం డిట్లు
లిట్లు నిజభర్తృ శుశ్రూషయందు నిత్యాసక్తయైన పతి
వ్రతకు సకలం బును దాన [illegible] ఫలంబులు సులభంబు
లగు [illegible] వైదిక [illegible] నియమిత
[illegible] వలయు [illegible]

ఒక బ్రాహ్మణుండు ధర్మతపశ్శీలుండు సంతతాధ్య
యనతత్పరుండై యొక్క శిష్టగ్రామంబున నుండు నతం
డొక్కనాఁడు గ్రామసమీపంబునం దొక్క వృక్షమూ
లంబున నాసీనుండై వేదంబులు గుణియించుచుండఁ
బదియ శాఖాగతంబైన కొక్కెర యతనిపై రెట్టవైచిన
నమ్మహాద్విజుం డలిగి చూచుటయు నది యప్పుడ నిశ్చే
తనంబై నేలంబడినం గనుంగొని యతండు ॥

క॥ అక్కట నాహృదయము గడు । నక్కటి
బను దేనిదమ్యే ననిమిత్తము యీ । కొక్కెర నిటు చే
సితి నా । రెక్కడి శాంతియని వికల హృదయుండా
గుచుఁ ॥

వ॥ రెక్కఘంటలు పిదప మధ్యాహ్నం బగుట
యుఁ గృతస్నాన విధానుండై గ్రామంబున కరిగి యందు
శుచులైన విప్ర గృహంబుల కరిగి భిక్షాచరణంబు సేయుచు
నొక్క పుణ్య గృహంబు వాకిట నిలిచి భిక్షాందేహి యను
టయు నాయింటి సతియు నతి సంభ్రమంబున భిక్ష
యిడుటకుం బాత్ర శోధనంబు సేయునెడ॥

ఉ॥ ఆ కులనాగ భర్త గడు నాఁకటఁ దూలుచు
వచ్చె వచ్చినన్ । తోయజనేత్ర సంభ్రమముతోఁ బగు

పీఠముఁ బెట్టి పాద్యముం । బాయక మజ్జన క్రియయు
భక్తి నొనర్చి ప్రియోక్తు లొప్పఁగా । నాయనఁ దృప్తుఁ జేసె
రుచిరాన్న రసంబున నింతి చెచ్చెరన్ ॥

చ ॥ కుడిచిన పిమ్మటం గుసుమ కోమలి విస్తృత
సంస్తరంబుగా । నొడికపు శయ్య సేసి ప్రియుఁ డొ
య్యన నంత శయింపఁ దమ్ములం। బిడి చరణంబు లొత్తి
మది రేఁగఁగ యంతటిలోఁ దలంచె నము । న్నడరఁగ భిక్షు
వై నిలిచినట్టి మహీసుర ముఖ్యు నాత్మలోన్ ॥

వ ॥ ఇట్లు తలంచి భిక్షుఁగొనుచుం జనుదెంచిన
నమ్మగువం జూచి కౌశికుండు రోషరంజిత లోచనుండ
గుచు నిట్లనియె ॥

క ॥ అడిగిన యప్పుడ చెచ్చెరఁ । గడపినఁ బోన
వ్వయేను గదు దుర్మతివై । పడఁతి నను నిలిపి భిక్షం ।
బిడక కడున్ నవజ్ఞ సేసి తేల మదమునన్ ॥

చ॥ అనినఁ బతివ్రతా తిలక మాతని కిట్లను నయ్య
పత్ప్రియుం। డనుపమిత క్షుధా కలితుఁడై చనుదెంచిన
భక్తి నమ్మహా । త్మునికి సపర్య సేయుచు నిను మ్మదిలోనఁ
దలంపఁ జాలనై । తి నిదియుఁ దప్పుగాఁ గొనక ధీరత
దప్పు సహింపఁగాఁ దగున్ ॥

వ ॥ అనిన నమ్మహీదేవుం డప్పతివ్రత కిట్లనియె॥

ఉ॥ నీవుగఁ డింత యెక్కుడవె మానినులు భూసురు
లింత తక్కువే । కోమలి యేల యిట్లు గడుఁ గ్రొవ్వునఁ
గానవు లోక వంద్యులఁ । భూమి సురేంద్రులఁ దివిజ
పుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్వఁగా । నేమిటి కింక వారు
గడు నెల్లిదమ్మై రిటు నీకు నిచ్చటన్ ॥

క ॥ అవమానితులగు ధరణీ । దివిజులు కోపాగ్ని
శిఖల దీపించి మహా । ద్రి వన ద్వీపంబులతో । నవని నయినఁ
బాడవడంతు రప్రతీకారుల్ ॥

వ॥ నీవింత నుల్లసైతివి గాకేమి యనిన నయ్యం
గన యిట్లనియె ॥

సీ ॥ దేవతాపతులు భూదేవతావరులయ్యె యేను
దన్మాహాత్మ్య మెఱుఁగనయ్య । యొక విప్రుఁ డలిగి వరుణా
నిధి జలము లపేయము లగుఁగ శపించె నెట్లు । దండక
విషయంబు దగ్ధంబు సేయఁడే యలుకతో నొక్క మహా
త్ముఁడెందు । వాతాపి యను దైత్యవరు మ్రింగి యఱిగిం
చుకొనఁడె భూదేవుఁ డొక్కఁడుఁదు గనినీ । ధరణి మఱి
యను నెక్కు తీర్థంబులందు । బ్రహ్మవిదమైన బ్రాహ్మణ

ప్రభుల మహిమ। వినవె యెఱుఁగి యెఱింగి పద్మినుత
చరిత। కొఱవిఁ గొని వెత్తినే తల గోకికొనఁగ ॥

వ ॥ నాకెఱింగఁ జెప్పెద నాకర్ణింపుము.

తే- గీ ॥ పతియె చూవె నాపాలిటి పరమ దైవ।
మేను వాఙ్మనస్క్రియలఁ దద్గతమ యెపుడుఁ। గోరి యున్నంతు నిది నాకు గొనకొనంగ। ధర్మములు గాఁగ నుండుదుఁ దలఁచి చూడ ॥

వ ॥ నీవు క్రోధనుండ వగుట యెఱుంగుదు నీకోపంబున నుక్కు కొక్కెర నిహతంబయ్యెం గాదె యది మదీయ పాతివ్రత్య మహిమం జేసి కాంచితిఁ గావునఁ గ్రోధంబుఁ గొనియాడుట లగ్గుగాదని మఱియు నిట్లనియె ॥

తే - గీ ॥ క్రోధ మోహ నామకులైన ఘోర శత్రు। లిరువు రెఱియించుచుండెద రెపుడు నరుని। నంతరంగములోపల నడఁచ వన్నఁ। గలదె యారీతి బ్రాహ్మణ గౌరవంబు॥

సీ ॥ ఎవ్వఁడు సత్యంబు నెవ్వుడుఁ బల్కు నెవ్వాఁడు గురుజన హితార్థి। యింద్రియంబుల

సోఁగ్ని యెల్లవారలఁ దనయట్లకా చూచు ధర్మాభిరతుఁడు।
కామంబుఁ దగులందు గర్మంబు లాఱును సముచిత సం
ప్రయోజిత నెసర్చు । నట్టి పుణ్యాత్ముని ననఘు బ్రాహ్మ
ణుఁడని యనిశంబు గీర్తింతు రమరవర్యు । లార్జవంబు
శమము నధ్యయనంబును । బరమ ధనము సువ్వె బ్రా
హ్మణునకు । ధర్మగతికి నవియ తగు సాధనంబులు । వేద
విహిత ముఖ్య విధులు నివియ ॥

వ ॥ ధర్మంబు బహు మార్గదృష్టంబై సూక్ష్మం
బైయుండు నీవు కేవల స్వాధ్యాయ పరుండవు గావున
ధర్మసూక్ష్మత యెఱుంగవు కావునం జడయక మిథిలా
నగరంబున కరుగు మందు జితేంద్రియుఁడును సత్య
వాదియు మాతా పితృ భక్తుండును నైనవాఁడు ధర్మ
వ్యాధుండను కిరాతుండు నీకు నఖిల ధర్మంబు లెఱిం
గించి సంశయచ్ఛేదంబు సేయు నాయెడం బ్రసన్నుండ
వగునది పతివ్రతలకుం బరిజ్ఞానంబు లేదు గావున నా కెట్టి
యపరాధంబు సేసినను సహింపవలయుఁ గదా యనినఁ
గౌశికుం డిట్లనియె ॥

క॥ ననుఁ దూఱఁగఁ దగు నీకట। మున నాచిత్తము

ప్రకాంబిః బారసేఁ బురంధ్రి । జన వినుత పోయి
పదేడ నసుపమ శోభనసమృద్ధ యయ్యెదు నీకుఁ ॥

వ ॥ అని యాడుణంబ యప్పుహాద్విజుండు ధర్మ
వ్యాధ దర్శన లాలసుండై కదలి పతివ్రత యెఱుకకు
విస్మయం బందుచుఁ దన్నుం గృతాపరాధునింగాఁ దలం
చుచు ననేక నగర గ్రామంబు లతిక్రమించి చని యనుప
మాన శోభాసనాథంబైన మిథిలాపురంబు సొచ్చి రాజ
మార్గంబు వెంటని యచ్చటి జనుల ధర్మవ్యాధుం డున్నయెడ
యడిగి వారెఱింగించిన నయ్యెడ కేగి ముందట నల్పమృగ
మాంస ఖండంబులం గడిం బచరించి యమ్ముచున్న వాని
ననవరత విక్రయాగత జన సమావృతుంగని యతి జుగుప్సి
తంబైన సూనాపణంబు సొరనొల్లక తొలంగి యొక్క
యెడ నుండె నంత ॥

ఆ - వె ॥ వాఁడు నతని రాక పోఁడిగ నిజబుద్ధి ।
నెఱిఁగి యతని యున్న యెడకు వచ్చి । పరమ భక్తి
ప్రమొక్కి ధరణీసురేశ్వరుఁ । గుశల మడిగి ప్రియము
గొనలునిగుడ ॥

చ॥ అనఘ నితంబినీతిలక మైన పతివ్రత నాకె
ఱుంగునె। ప్పినఁ జనుదెంచి యీవు ననుఁ బ్రీతిఁ గనుం
గొన నీమనోరథం। బును మదిలో నెఱుంగుదుఁ బ్రమో
దముఁ జెందితి రమ్ము మద్గృహం। బున కని పల్కి
తోడుకొని పోయె నతండు మహీసురోత్తమున్॥

వ॥ కౌశికుండును ధర్మవ్యాధునెఱుక కచ్చెరు
వంది పతివ్రత యెఱుకయుం దలంచి యిది రెండవ యా
శ్చర్యంబు గంటి నని తలంచుచుఁ దదీయ భవనంబున
కరిగి వానిచేతం బూజితుండయ్యె॥

శ్రీరస్తు.

---

# స తీ హి త సం గ్ర హ ము

## మూఁడవ భాగము.

## సత్యా ద్రౌపదీ సంవాదము.

వ॥ కృష్ణ వల్లభ యైన సత్యభామయుఁ బాంచా
లియు నేకతంబ ప్రియసల్లాప సంసక్తలై యుండ సత్య
భామ ద్రౌపది కిట్లనియె ॥

సీ॥ నీ ప్రియ భర్తల నిర్మల చరితులఁ బ్రకట
తేజుల లోకపాల నిభులఁ । బార్థుల నీ వొక భంగిని వద
లక చెలువ మొప్పంగ భజింతు దగిలి । యొక్కరొక్కరి
కంటె నువిద నీ కెప్పుడు నను రక్తులగుట యత్యద్భు
తంబు । నగు మొగంబుల కాని నాఁతి నీ దెస నెప్డుఁ బతు
లకుఁ గిన్క యొప్పాట లేదు । వ్రతము వెంపొ మంత్రౌ
షధ వైభవంబొ । సరస నైపథ్య కర్మ కౌశలమొ చతుర ।
విభ్రమోల్లాస రేఖయో వెలఁది నీవి । శేష సౌభాగ్య
హేతువుఁ జెప్పుము నాకు ॥

క॥ ఏనును నీవలన నిజము । గా నిది యంత
యును నెఱిఁగి కమలదళాక్షుఁ । బూని వశగతునిఁ
జేసి య । నూన స్నేహమున భోగ యుక్తిఁ దలిర్తుఁ ॥

క॥ అని యడిగినఁ దది నించుక । గినుక వొడము

నడచుకొనుచుఁ గృష్ణ మృదులహా । సిని యడుగుచు సత్య
భామఁ । గనుఁగొని యిట్లనియె నిర్వికారాకృతినై॥

క॥ నను నిట్లు దుష్ట వనితా। జనము నటులు గాఁ
దలంపఁ జనునే నీకుఁ । మన సొప్పదు పురుషోత్తము।
వనితవు గాఁదగవు నీవు వనరుహనయనా ॥

వ॥ అని పలంవుఁ జందంబుగా వివేక విహీనత
నొలుకపడ నాడి పాంచాలి మఱియు నిట్లనియె ॥

చ ॥ అలయక మంత్ర తంత్ర వివిధౌషధ భంగు
లఁజేసి యెంతయుఁ ।పలతురు నాథు లంట మగువా కడు
పేలతనంబు దాన నుఁ। గలిగిన ప్రేమయు నుబ్బలియుఁ
గాని యొకంటను సిద్ధిఁ బొంద ద । హ్వాలఁతులతోడి
యున్కి యహింపాత్రుగఁ జూచు విషం బెఱింగినఁ॥

చ ॥ మగువ యొనర్చు వశ్యవిధి మందులు మూ
యలు నొందు చందనై । మగనికిఁ దెచ్చు రోగములు
మూనక మూక బధిరాది భావముల్ । మిగి యొనరించు
నశ్వరితము ౘనచేసిన చేఁతనై తుదిఁ। జగమున నెక్కు
నిందయును సద్గతి హానియు వచ్చు నింతికిఁ ॥

క ॥ కాపునఁ బతులకు నెప్పుడుఁ । గావింపఁగఁ
దగదు కపట కర్మంబులు ద। ద్భావ మెఱిఁగి వశవర్తిని।
నై వనిత చరింప నదియ యగు నెల్లవియుఁ ॥

వ ॥ పాండవులయెడ నేనెట్టి దాననై యిట్టి సౌ
భాగ్యంబు నందితి నది నీకు నెఱింగించెద నేర్పడ
వినుము ॥

సీ ॥ పతులాత్మ నుండఁ డోడక పడఁతులఁ గలసిన
నలుగ నెయ్యెడల నహంకరింప । మదముఁ బ్రమాదంబు
మాని వారికిఁ జిత్త మేకముఖంబుగ నెల్లప్రొద్దు । భక్తి
సేయుదుఁ జూపు పలుకులు గోర్కియుఁ జెయ్వులు
వింతగాఁ జేయ నెపుడు। నమర గంధర్వ యక్షాదు లందైన
నను బురుషు నన్యునిఁ దృణంబుగఁ దలంతు । స్నాన
భోజన శయ నాది సంప్రయోగ । మర్థిఁ బతులకు ము
న్నెందు నాచరింపఁ।బతులు వచ్చిన నాసన పాద్య విధుల।
భక్తితో నేన కావింతుఁ బనుప నొరుల ॥

చ ॥ తగిలెడు వేళయందు నియతంబుగ మజ్జన
భోజనక్రియల్ । దగ నొడఁగూర్తు భర్తలకు ధాన్యధనం
బులు రిత్తపై వ్యయం। బగుటకు నోర్వ నెవ్వడు గృహ
స్థల భాండ విశోధనంబు లి। మ్ముగ నొకనాఁడు నేమఱఁ
బ్రమాదము సల్పుదు బంధుకోటికిన్॥

క ॥ పలుమాఱుం దలవాకిట । వెలఁగుట యస
తీ జనైక మిత్రత కలహం । బుల కెలయుట నగు పలు
కులఁ । బెలుచ నగుట నాకుఁ గాని పేరివి మగువా॥

క॥ పతులిచ్చు నొయుఁ బ్రవాస। స్థితులైనం బుష్ప
గంధ దీప్తాభరణ । ప్రతతి ధరియింపఁ దగ్గత । వ్రతినగు
చుఁ దదాగమంబు మదిఁ గాంక్షింతున్ ॥

ఉ ॥ అత్తకు భక్తిగల్గి మది నాయమ చెప్పిన
మాత్రికెంతయున్। వృత్తము లాశ్రయింతు గురు విప్ర
సురాతిథి భోజనంబు లత్యుత్తమ భక్తి నేన తగ నొపి

నొనర్తుఁ బ్రియంబుఁ దాల్మియుఁ । మెత్తుఁ దనంబు సంతతము మేలుగఁ దాల్తు సమస్తభంగులన్ ॥

క ॥ కదు మృదువు లనుచుఁ దేఁకువ । చెడి యెపుడుఁ జరింప భరతసింహులు కోపం । బడరిన నాశీవిషములు । పరుషుల నుగ్రులని వెఱపు వదలక కొల్తున్ ॥

సీ ॥ మా యత్త పృథ్వీ సమాన పృథాదేవి కుంతి భోజాత్మజ కోమలాంగి । సతతంబు భోజన స్నానాదికములయం దిట్టగఁ బరిచర్య యొనరచేసి । సంప్రీతిఁ జేయుదు జనవంద్యుఁడగు ధర్మతనయుని యింటి నిత్యంబు పసిఁడి । పళ్లెరంబులఁ గుడ్చు బ్రాహ్మణు లతిథులు ఎనిమిదివేలు సమిద్ధమతులు । యతులు పదివేలు వారల కనుదినంబు । నన్నపానంబులందు సహాయ నగుచు । నుడికముగ నేన కావింతు నుచితవస్త్ర । భూషణాదుల బరితోషముగ నొనర్తు ॥

వ ॥ మఱియు ధర్మరాజు నగరియందుఁ గనక భూషణాలంకృతులైన పరిచారకులు నూఱువేలు రేయును బగలును బాత్రహస్తులై యభ్యాగత భోజనంబు లొడఁగూర్చువారు గలరు వీరెల్ల నిట్టిట్టి మెలఁకువల మెలంగుదురని తత్కృత్యాకృతంబుల నేన యెఱుంగుదు నిరంతర మద ధారా తరంగిత కపోలంబులైన భద్రగజ శత సహస్రంబులు ప్రభూత జవ సత్త్వ సన్నుతంబులైన యుత్తమాశ్వ శత సహస్రంబులుం గలవు వానికి నన్నిటికి నిత్యోచిత ఖాద్యంబు లొసరింపను దగినవారి నేన

నియమింతు సఖండ భాండాగార పూరితంబులైన యా
య వ్యయంబులు నా యెఱుంగని యవి లేవు గోపాల
జనంబులు తుదిగాఁ గల సకల భృత్యజనంబుల జీవితం
బుల నరని యేన నడపుదుఁ బరమ యశోధనులగు పాండు
నందనుల కుటుంబ భారంబు సర్వంబును నాయంద సమ
ర్పించి తారు నిర్భరులై యిష్ట విహారంబుల నుందురు
రే నెల్లవెంటల నప్రమత్తనై వర్తింతు॥

ఆ- వె॥ వేగు జాముగలుగ వెడ నిద్రఁబొందుదుఁ।
గాని రాజ్యభార కార్యయుక్తి । నజ్జనయన నాకు నా
హార నిద్రల । కెడము లేదు సువ్వె యెల్లప్రొద్దు ॥

ఆ - వె ॥ ఇట్టి వర్తనముల నెపుడుఁ బాండవు
లకుఁ । దగిలి ప్రియము సేయఁ దగితిఁ గాని । మగువ
నీవు చెప్పు మందులు మూఁకులు । నింద్రజాలములును
నేనెఱుంగ ॥

వ ॥ అనిన విని లజ్జాకలిత చిత్తయగుచు సత్య
భామ పాండవభామిని కిట్లనియె ॥

క ॥ ఏ నెఱుఁగమి నిట్లడిగితి । నా నేరమి సైఁప
వలయు నగవుగఁ గొను మీ । మానిని నావలుకులు స ।
న్మానితము భవచ్చరిత్ర మహిమ ధరిత్రిన్ ॥

వ ॥ అనినం బాంచాలి మందస్మితాననయగుచు
నది యట్లకాక యని పలికి మఱియు నిట్లనియె ॥

చ॥ తరిరి మురారి నీకుఁ గడుఁ దీఁపుగఁ జెప్పిన పల్కు గల్గినన్ । కువలయనేత్ర నీపనను గూడినవారికి నైనఁ జెప్పఁగా । వలవదు దాన నుండొక నేపంబు గడింతు రెఱింగిరేని నీ పతులు కృష్ణబుద్ధి విరసంబగు నీదెసఁ దల్పియుక్తిచేన్ ॥

చ॥ పతికి ననుంగునైన తగు బంధుల మిత్రుల భోజనాది స । త్కృతముల నాదరించుచు నకృత్రిమ భక్తి విశేష సంతతో । దిత మతివై చరింపుము తదీయ హితేతర వృత్తునైన వా । రతివ భవత్సపత్నిజనము నైనను నై కొనకుండు మెప్పుడున్ ॥

క॥ వినుము ప్రద్యుమ్నాది భవ । త్తనయులకడ నైన నేకతంబున నేకా । సనమున నుండుట దూష్యం । బని యెఱుఁగుము సతుల చరిత లతిదుష్కరముల్ ॥

క॥ కులసతులును సతులును ని । ర్మలమతులును నైన యట్టి మగువలతోడన్ । జెలిమి యొనరించునది మ । ర్త్యలనిత వనితాభయుక్తి విడువుము తరుణీ ॥

వ॥ ఇది నీకుఁ బరమ సౌభాగ్య మూలంబైన యుపాయం బనినం బ్రీతచిత్తయై సత్యభామ యిట్లనియె॥

సీ॥ నీవు ధర్మజ్ఞవు దేవసన్నిభులు నీభర్తలు మహనీయకీర్తిధనులు । శౌర్య తపోబల శౌర్య సంపన్నులు గావున నీకి నేవిధమున । భారతీ రాజ్యంబు

సేవెదుఁ దడయక మీ కెగ్గు సేసిన లోక నింద్య । చరి
తుండు గౌరవ ధరణీశు వనితలు దిక్కులేకలమటఁ బా
క్కుచుండఁ । గని ముదంబును బొందెడు వనిత నీవు ।
సుతుల నత్యంత నిర్మల మతుల కార్య । యములఁ గాం
చిన సద్గుణాన్వితవు వగవు । వలదు చిత్తంబులో నీవు
జలజనయన ॥

వ॥ ప్రతివింధ్యాదులైన నీపుత్రులు నేఁడిప్పుడు
వచ్చి యదుపురంబున నున్నవారు వారికి నొక్కటం
గొఱంత లేదు రుక్మిణియు సుభద్రయుఁ దక్కిన
వారలు నక్కుమారులయెడం దమకొడుకులకంటె గౌర
వంబు సేయుదురు వారియందు నిశ్చింతవు గమ్మని యు
నయ్యవసరంబునఁ గృష్ణుండు పాండవుల వీడ్కొని
మార్కండేయాది విప్రజనంబుల నామంత్రణంబు సేసి
గమనోన్ముఖుండగుటయు సత్యభామ యాజ్ఞసేనిం గౌఁ
గిలించుకొని సగౌరవంబుగా వీడ్కొని నంత వాసు
దేవుండును ప్రియా సహితంబుగా రథారూఢుండై
ద్వారవతీ పురంబున కరిగె ॥

సీ॥ స్నానంబుఁ గావించి చనుదెంచునంతలో జపవే
దిఁ దగురీతి సవరుఁజేయు। జపనిష్ఠ యొనరించి చాలించునం
తలోఁ జక్కఁగా దేవపూజకు నమర్చు। దేవపూజ యొనర్చి
తిలకించునంతలో షడ్రసాపూర్ణ భోజనముఁ బెట్టు। భోజనం
బయి కరంబులు గడుగునంతలోఁ బర్ణాజినములచేఁ దా
మ్బూలమర్చుఁ। దాన్పుపైఁజేరునంతలో బడలికనిమ। నంబుసఁ
దలంచి తాళవృంతమున విసరి। తొడలపై నంఘ్రులుంచి
యొత్తుచున నేక। సేవలొనరిం[illegible]గ్గురుబోఁడి॥